అయ్యో! యీయనవాహనమున కీయాకస్మికసంభ్రమ మేమి కారణమా? ఆ! తెలిసినది

ఉ. మాత! జోహార్ జోహా ర్మహిషమర్దని! నీ కని మ్రొక్కుదేవసం
ఘాతము వాక్ప్రయంబు భయకంపిత మౌచును నాలకించి, తక్
దూతలు మట్టుకొన్న జవధూతవిషాణభయానకంబుగాఁ
బోతు ప్రధానకంబు సలుపున్ వలవంకకు ఘుంట మ్రోఁగఁగన్ 17

(అన్యత్ర చూపుఁ బఱపి భయముతో)

చ. వికటపుమోముఁ, గ్రొమ్మెఱుఁగువంటి ద్రుకలున్, నరకంఠమాల, తా
శికుటమహాభుజంబులు, జ్వలన్నయనంబు లగోన్నతంబు మే
చకఘనకాయముం గలిగి సర్వభయంకరుఁ డౌచు విన్కనిన్,
వికృతము డా [illegible] ండి కనంబడు నీతఁ డెవ్వఁడో, 18

(విమర్శించి) ఇతఁడు [illegible] డని వినంబడురక్షఃపతి నిరృతి యని తలం
చెదను. (నవ్వి) అహో! యీతనియం దంబికాపరివారవర్గమున కెంతసౌ
హార్దము!

తే. గీ. వేగఁ బ్రత్యుద్గమింతురు, కౌఁగిలింత్రు। స్వాగతంబుల నడుగుదు రవసరంబు
నుచితము వచింత్రు, నిరృతిరా, నిచట నున్నప్రమథులెల్లను నిండారుప్రమదమునను.

(స్పర్శసుఖమనుభవించి) ఏమిది? నాయంగము చల్లనిమడుఁగులో మునిఁగినట్లు లా
ఘవ మొందుచున్నది! (చూచి)

తే. గీ. హారకుండలధరుఁడు రమ్యాననుండు। నగుచుఁ గనుఁగవ దనియించు నంబుభర్త,
విమలతారకపూర్ణసుబింబయుక్త। మైనగగనావకాశంబునంవమునను. 20

ఓహో; యీతని తేజ మితర తేజఃపరిభావకము.

క. వరుణుని తేజం బన్యము। హరియించు నటన్న నేమి యబ్బుర మీతం
డిరవుకొనుకడను [illegible] తరుణమున నె పొనుఁగుపడుఁ గదా పెనుజోతుల్. 21

(మఱియొకయెడఁ జూచి తావి నరసి) సకలేంద్రియసంతర్పణం బయినపరిమళంబునఁ
బ్రపంచము ముంచివేయుచున్నాఁ డీతఁ డెవఁడో? (బాగుగఁ జూచి)

చ. అనలుఁడు మిత్రిసంతుఁ డగు, సన్నము పాముల కబ్బు, నూర్పుప్ర
చ్చును భువనం బనూన మగు శూలిశరీర మెవండు గల్గ, మూ
ర్ధనమనసంచలత్కుసుమదామగళన్మకరందపలుబ్ధభృం
గనిచయగానబంధురుఁడుగా నలగంధవహుండు దిగ్గడున్. 22

(ఇంక ప్రవేశించినట్లుగా) ఏతద్దర్శనంబున నాహృదయ మేమో కాని యనిర్వాచ్య మయిన

యౌత్సుక్యము నొందుచున్నది.

తే. గీ. మానసము హర్షపడు, స్వాప్నమతి జనించు
నితనియెడ నేమొకో యిది యే నెఱుంగ; (చిఱునవ్వుతో)
నైన సంగంబునను గేవలైక్యబుద్ధి
గలుగు సమనామములకుఁ బయస్సులకుఁ బోలె. 23

(అతికష్టముగా నన్యత్ర చూపు [illegible] ఏకపింగళమయినకనుంగవతో సన్నిహితుం డయిన సమగ్రభూషణమణిప్రభాశకలితశార్వరాంధకారోన్మేషుఁ డీపురుషోత్తముఁ డెవ్వఁ డగునో? (తెలియుట నభినయించి)

చ. కలుములకాఁపురంపుటలకాపురమాళికి సార్వభౌముఁడున్
విలసితనైజభూధరనివేశితశీతలపాదచూడుఁడున్
లలితపుయక్షరాజ్యకమలాచపలావళి కంబువాహుఁ డా
నలఘుదిశాధినాథమణి యైలబిలుం డగునీతఁ డారయన్. 24

(సానునయహర్షంబుగా) ఆహా! నాసౌభాగ్య మవాఙ్మనసగోచరము గదా!

మ. సజవోచ్చైర్గలదౌపవాహ్యవృషభస్పందానువృత్తిస్ఫుర
న్నిజచూడోచ్ఛలితాదితేయతటినీనిర్హ్రాదుఁ డాహ్లాదకృ
ద్ద్విజరాజచ్ఛవి, తాను దృక్పథమునం దీపించుచున్నాఁడు పూ
ర్వజయుం డవ్వల దవ్వులం దొలఁగ దారిం దారునం దేవతల్. 25

ఉ. దేవర యిప్పు డొద్ద కరుదేరఁగ హర్షపరీతచిత్త యై
దేవియుఁ దత్తఱంబునను దిగ్గనఁ బర్యెకవ జాఱ లేచి, కై
లా విడఁగా జయాసఖి, కెలంకున మిక్కిలి సంభ్రమంబునన్,
దా విభు దాయఁగాఁ గొనిపదంబు లిదే మెలమెల్ల నేగెడున్. 26

(మరలవిలోకించి) ఆహా! యిది యతిమనోహరముగా నున్నది.

క. సురసిద్ధసాధ్యవిద్యా। ధరకిన్నరసుందరులయుదారనయనభా
సురముఖముల నిండి దివం। బరు దగు బహుచంద్రమండలాన్వితమట్లై. 27

నే నీబృందారకుల కందఱకు వందన మాచరించెదను.

తే. గీ. లగ్గు నొడగూర్ప నెగ్గుఁ దొలఁగఁ బెట్టఁ
గలుగునింద్రాదిదిక్పాలకులకుఁబ్రీణితిఁ
యేతదఖిలామరశ్రేణి యెపుడుఁ గొలుచు
దేవి కీశైలరాజపుత్రికి జోహారు. 28

(నమస్కరించి లేచి పైకిఁ జూచి) అయ్యో! యాకాశము శూన్యమైనది.

తే. గీ. వేలుపులు లేరు; లేరు దిక్పాలు రప్స । రసలు లేరు; విమానసర్గంబు లేదు;
కేవలంబును దొంటిభయావహంపుఁ । జిమ్మచీఁకటి శేషించెఁ గ్రమ్ముఁకొనఁగ.

నిర్వర్తితశర్వాణీపర్యను లయి గీర్వాణులు గమించి రని తలంచెను. (హర్షముతో)

తే. గీ. వెనుకటిభవంబులందు సల్పినమదీయ
బహుతరోత్కృష్టతప మెల్లఁ బండె నేఁడు;
దేవతాసార్థమును దాను గేవలంబు
సాంబమూర్తియె నాకు సాక్షాత్కరించె. 80

(విమర్శించి) సర్వమంగళాచరణమూలోపసర్పణమున కిదియే నా కనుకూలసమయము సమీపించెడను. (పరిక్రమించుచు నపేక్షతో) అంబిక యనుగ్రహించునా?

క. ఉపచితఘనరాగుఁడ నే । నపారవిఘ్నాంధకార మడఁచి కరమునన్
జపలాక్షికేల్గ్రహింతు నొ । తపనుండు సరాగనళినితామరవోలెన్. 81

(ముందుచూచి) ఇదె యుపవనద్వారము. నే నిందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి తొట్రుపాటు నభినయించి నిర్వేదముతో) ఇది సమప్రదేశ మయినను నాయడుగు తొట్రుపడు చున్నదేమి కారణము? కానీ. ఇక్కడనే కూరుచుండి దేవిని బ్రసన్నురాలిం జేసికొనియెదను. (దోసిలిపట్టి)

ఉ. పంచలపాలుగా భిదురపాణి, కుబేరుఁడు పాఱ భీరుఁడై,
కాంచఁగ నీళ్ళలోఁ డాఁగ వలఁ గంపము, శూలియు మూలఁ దూఱ, వే
యంచులవాలుఁజోదు పొరయం బలుబాములు, సైఁప కెన్నరా
త్రించరుమస్తమేద్రంబు మధించినదేవిపదంబు గొల్చెదన్. 82

(సశ్లాఘముగా నాకాశమున)

ఉ. తోడివయస్య యావిజయతో సరసోక్తుల నింక మానకే,
జోడుగ నొద్ద మన్నశశిచూడునిమోమునఁ జూపుఁ ద్రిప్పకే,
పోఁడిగ నెత్తునంఘ్రిమణిభూషయు గల్లన మ్రోఁగ కుండఁ జెం
డాడితి వద్రిజా! మహిషు; నంబ! యి దేమి విలాసమో గదా. 83

(నిమిత్తమును సూచించి)

తే. గీ. ప్రియతమాలింగనము నీకు బెరయ దింక
నకట! దక్షిణబాహువా! యదర దేల?

యెఱుఁగవే మల్లికానుటనైకహేతు
నైనగగనోత్థకఠినవాక్యంబు నీవు? 24

(నిశ్వసించి యాకాశమున)

తే. గీ. ఆయనిర్వాచ్యకన్యకానర్ఘరత్న । మల్పసుకృతుఁడ నగు నాకు నబ్బని తగుఁ;
గాని త్వద్వాక్యమే కదా దానమూల । మంబ! నీకరుణార్ద్రిత కద్ది తగునె?

అయినను స్వకర్మాధీనసుఖదుఃఖుఁడ నయిన నేను భగవతి నీకాత్యాయని నుపాలంభించెద నేల? ప్రియతమురాలు లభింపమింజేసి నాజీవితము నిష్ఫలము గావున స్వయముపహృతంబు లయినయసుకుసుమంబులచే నీయార్యామహాదేవి నర్చించి సంతోషపఱిచెదను. (మరల నాకాశమున) ఓకాత్యాయనీ!

తే. గీ. ప్రణతకామితమందారవల్లి! తల్లి! । యనుఁగుఁజెలి నాదు మల్లిక యబ్బదేని
నాదు హస్తాసిలూనకంఠంపు మోము । గనుమిపుడు నీపదములఁ గోకనద మగును

(కత్తి దూసి సప్రార్థనముగా)

తే. గీ. పద్మపాటల మైననీపదములందు । దేవిరో! నాకు భక్తి వర్థిల్లుఁ గాక;
యనుఁగుమల్లికతోడ జన్మాంతరంబు । నందు నైనను సంగమ మబ్బుఁ గాక.

(ఖడ్గము కంఠమునం దుంచుకొనుచున్నాఁడు)

(ఆకాశమున) హా! నాథ! మారుత! రక్షింపుము రక్షింపుము. రాక్షసహస్తమునం దిట్లు చిక్కియున్నన న్నేల చూడవు? మొట్టమొదట మత్తేనుఁగుహస్తమునుండి నన్ను విడిపించి బ్రతికించినవాఁడవు నీవే కావా? హా! యంబ! గౌరి! నేను సత్యముగానే రాక్షసహస్తమున త్రోయఁబడితిని. హా! తండ్రి! హా! తల్లి! యిదిగో! గౌరీప్రసాదలబ్ధయయిన మీయేకపుత్రి మల్లిక చెల్లిపోవుచున్నది. హా! మాతృసమానురాల! భగవతి! మందాకిని! యిదిగో! నేను నీయాశ్రమపుసమీపమునకే తేఁబడినదానను. అమ్మా! నామీఁదిప్రేమచేతను గదా నీవు హిమగిరిని విడిచిపెట్టి యిచ్చోటికి వచ్చేసితివి! హా! సఖి! నవమాలిక! హా! కాళింది! మీదర్శన మిఁక నాకు దుర్లభము గదా! (ఖడ్గము కంఠమునుండి తీసి సంభ్రమాభిప్రాయములతో) ఏమిది! మల్లికాస్వరము కరుణకరుణముగా గగనగోచరమగుచున్నది! (విషాదవితర్కములతో)

ఉ. ఆక వసింప మేడపయి నభ్రము మిం చని కొంచుఁ బోయెనో?
నాక మలంకరింప సురనాథుఁడు వేలుపులున్ హరించిరో?
ప్రాకటభూష చంద్రకళ రాలె నటంచు గిరీశుఁ డెత్తెనో?

యాకసమం దిటుల్ కురరి యై విలపించెదు భీరు వే మొకో? 38

(పైకిఁ జూచి) అన్నన్నా! యెంతప్రమాదము

సీ. గుండె జల్లనుపల్లకోరమీసంబులు, వ్రేలుజుంజుఱు రాగి వెంట్రుకలును
ముడివడ్డబొమలమోమును, బెద్దతలకాయ, కఱకు దేరినవంక మెఱుఁగుఁగోఱ
లుఱుకు గ్రుడ్డులుఁగల్గి వ్యోమంబునను దమశ్చయమట్లు తోఁచు నీభయదుఁ డెవఁడొ?
తెలిసె నిశ్చయము; రాత్రించరుఁడు వీఁడు, ప్రథాపించుచున్నాఁడు; దైవ మెంత
యాపదఘటించె! నదె వానియంకతలము
నుండి ప్రభ్రష్ట యాచుఁ బయోధరంబు
వలనఁ గ్రొక్కారు మెఱుఁగుఁదీవయును బోలెఁ
బడెడు మల్లిక గడగడ వడఁకు చహహా! 39

(కన్నీళ్ళతో) హా! విధాతనిష్కరుణత!

చ. మునుమును నేన నేన యని బోటులు చేతుల నూఁత యీయ సో
పనములదారి నైనఁ గటిభారమునన్ మెలమెల్లడిగ్గనం
గన గగనంబునుండి పడిగాఁ బడు గాంగఝరిం బెకల్చి చి
మ్మినచవుదంతిచేతిబలిమిం బడుబంగరుఁదమ్మితీఁగనాన్. 40

ఈమెను నేను బడకుండఁ బట్టుకొనియెదను. (ఖడ్గము క్రిందఁ బెట్టి చేతులు వెలికిలఁ బయికెత్తుచున్నాఁడు)

(తరువాత మారుతహస్తగతయయి వడఁకుచున్న మేనితో మల్లిక ప్రవేశించుచున్నది.)

మల్లి— హా! పడిపోయితినిగదా!

మారు— (కన్నీళ్ళతో) అదృష్టవంతురాల! భయపడకు భయపడకు.

చ. మదిఁ బదిలించుకొమ్మిటులు మాటికి మేను వడంకనేల? నీ
కొదవ దుపద్రవం బసురయువతి నేని మఱొంటనేని యిం
కిది యభయప్రదేశము సుమీ! భవదీయవిధేయుచేయి యన్
మృదుతలిమంబునందు వసియించినదానవు చూడు సుందరీ. 41

మల్లి— (చయ్యనఁ జూచి) అహా! మహాభాగుఁడే. హా! మహాభాగ! (కంఠము గౌఁగిలించుకొనుచున్నది)

మారు— సుందరీ! యిది యేమి?

మల్లి— (దడవుగ నిశ్వసించి సిగ్గుతో) నేనాకాశవాణీప్రమాణమువలన మహాభాగుని పాదసేవ దుర్లభ మని తలంచి యీయర్ధరాత్రమునఁ బ్రాణసఖి యయిన నవమాలిక

ను గూడఁ గన్నమోఱఁగి మరణమునఁ గృతనిశ్చయురాల నయి భవనోద్యానమున కుఁ బోయితిని. పోయినతోడనే యెవఁడో రాక్షసుఁ డొకఁడు న న్నాకస్మికముగా నెత్తుకొని యాకసమునఁ బఱ గెత్తుచుండఁగా దైవికముగా వానిబారికిఁ దప్పి యిప్పుడు దేవరచేతిలోఁ జాఱి పడితిని.

మారు—(ఉచ్ఛ్వాసముతో)

ఉ. పాయవు శ్లాఘ్యజీవనము బంధుజనప్రియ! నాకునై, శుభం
బీయను తంపుమేను వొలియింపఁడు పీనుఁగుఁదిండి, పుణ్యు మా
హేయుని చేతికిం దొలఁగి తీగతి, భాగ్యము; నేలఁ గూలుచున్
నాయెద హేమమాలికయనం గయినేని తప్పృష్టమే, ప్రియా. 42

మల్లి—మహాభాగ! మీ రేల యిక్కడ దేవతాద్వితీయులరుగా విజయంచేసియుంటిరి?

మారు—ఉ. ఏనును నాశిరోంబుజము నీగిరిరాజతనూజ కింపుగాఁ
గానుక యిచ్చి, నన్ బడయఁగా మదిఁ గోరి, కురంగనేత్ర! కం
ఠానఁ గదించుకొంటి (చేతఁ జూపుచు) నికటస్థిత మీ యసి కేలఁ బూని—

మల్లి—(తొట్రుపాటుతో) మహాభాగ? సాహసము చేయకు.

మారు—(చిఱునవ్వుతో) యా! లోనసె నీదుశోకపుఁ బెలుంగు చెవిం బడఁ దంపు
మానితిన్. 43

మల్లి—(తనలో) అయ్యో! కడచినవృత్తాంతమా చెప్పఁబడుచున్నది? (సకరుణానురాగముగా) ఆహా! నానిమిత్తము మహాభాగుఁడు ప్రాణత్యాగము గూడఁ జేయఁ బ్రయత్నించెనే!

(తెరలో) ఎవఁడో యాయువు చెల్లినవాఁడు నాయుత్సంగమందలి మానవకన్యను దొంగిలించినాఁడు. నాయొడిలో నప్పటివి యిప్పుడు కనఁబడకున్నది. నేనో యుబుకున దానిని సింహళద్వీపముఁ జేర్ప నాలోచించితిని.

(ఇద్దఱు వినుచున్నారు)

మారు—(నవ్వి) అహా! దేవీప్రసాదమున నీమె నా చేతిలోఁ బడినసంగతి యీమూర్ఖరాక్షసుఁ డెఱుంగఁడుగదా!

మల్లి—(భయముతో) అయ్యో! రాక్షసుఁడు మరల వచ్చుచున్నాఁడు. (వడఁకుచున్నది)

మారు—(నవ్వి) సుందరీ! భయపడకు, క్షణమాత్ర మాచెట్టుచాటున నుండుము. ఈ చెనఁటిరక్కసుని నేను జెండాడెదను.

మల్లి—అయ్యో! మహాకాయుఁ డయినరాక్షసునితో నాథుఁ డెట్లు కలయఁ
బడునో?

మారు—(నవ్వి) భీరురాల! మహాకాయుఁ డయిన నేమి?

తే. గీ. చండదుస్సహవీర్యతేజస్వి యెందు
సరకు సేయఁడు పరవపుస్స్థౌల్యమబల!
యంబుజపుఁగెంపుఁదునుక దట్టియపరుటగ్గి
బూది సేయదె కొండంతపుడుకవామి? 44

మల్లి—(భయముతోఁ జెట్టుచాటున నున్నది)

మారు—(కత్తిదూసి గర్వముతో నిలఁబడుచున్నాఁడు)

(తరువాత వెదకుకొనుచు సంభ్రమముతో యథోద్దిష్టునుగా రాక్షసుఁడు ప్రవేశించు
చున్నాఁడు)

రాక్ష—

శా. నే నాసింహళదేశకాననపతిన్; దీంద్రించు నాప్రోలఁ గా
లూనన్ భ్రామితకూటశాల్మలి భయం బొందు న్మహోన్మత్తవున్;
స్త్రీ నంకస్థను గోలుపోయి వికటగ్రీవాసురుం డోర్చునే?
నానాతిం గయికొన్నయన్నరుఁ డెటు న్గాఁడే గతాయుం డిఁకన్. 45

మల్లి—(భయముతో) అయ్యో! భయంకరశరీరుఁ డగువీనితోడఁ గుసుమాయుధకోమ
లాంగుఁ డయినమహాభాగునకు సంగరం బెత్తెఱంగున జరుగునో గదా!

మారు—(చూచి విస్మయముతో)

మ. శిర మభ్రంకషతుంగశైలనిభ మీక్షింతుర్ సముద్గ్రీవులై
యురముం బ్రస్థవిశాలభీషణము, తాలోత్తాలముల్ బాహువుల్,
చరణన్యాసము ధూతభూతలము, చాలన్ వీనిమైసృష్టికిన్
బరమాణుత్వముఁ బర్వతంబులను పాంసం జేసెనో ధాత మున్. 46

(బిగ్గఱగా) ఓరీయమంగళస్పృశ్య!

తే. గీ. కుసుమసుకుమార, శృంగారరసపయోధి
సుధ, మదనజీవనాడి, నావిభవసదనను,
బరమకల్యాణి నంటునీశిరము నూఱు
వ్రయ్య లెటుగాదు రోరి క్రవ్యాదపాశ! 47

రాక్ష—(మారుతునిఁ జూచి) నిజముగా వీఁడే చోరుఁడు. (సోపహాసముగా) ఓరీ

సుందా! మేలు మేలు!

తే. గీ. గాఢవిషనప్నాభీషణకాలసర్ప। విస్ఫుటస్ఫటఫలకశోభితమణిశిల,
నస్మదీయాంకమధ్యపర్యంకవిధృత। జన్వనిని గవ్విలాడ వీ వెన్వఁడవుర?

మారు —(సక్రోధముగా) హా! లోకవిద్విష్టాచార! వెండియు నీవ్యవహారము కన్య కాంగోచరమే యగుచున్నది. (తిరస్కారముతో)

మ. అరితిం బాపమతీ! పలాశ! చపలాత్మా! శ్వాన మార్జ్యాహుతిం
బోరయం బోలునె? బాల నంటు టెటు? ఛీ! పో జీవ మాశించితే;
మరికాదేని, కఠోరఖడ్గదితయుష్మత్కంఠరాంతస్సిరాం
తరసమ్యూతకవోష్ణరక్తరుచిరమేదస్విన్ ధరంజేయుదున్. 49

రాక్ష —(బొమముడితో) ఆ! వికటగ్రీవుఁడ నగునాయెదుట నిలుచుచు నిశ్శంకము గాఁ బోఁడుకొనుచున్నావు! (బాగుగఁ జూచి ప్రత్యభిజ్ఞతోఁ దనలో) వీఁడే మద్గృహాలాంచలలిఖితుఁ డయినపడుచువాఁడు. చిత్రకన్యాచోరుఁ డని ఖడ్గజి హ్వుఁడు నాతోఁ జెప్పినవాఁడును వీఁడే. (పరిహాసముగా)

ఉ. ఏలర నుర్భ్యడింభ! నిరపేక్షుఁడవై నిజజీవమందు, నా
మ్రోలకు వచ్చినాఁడ విటు? మూఢుఁడ! పుణ్యము; కన్య కేమిపో
నీలులఁ జింతపండు బలె నీమృదులాంగము మేళగించి తృ
ష్ణాజ్వాల శమింపఁగా గుటగుటం దియనెత్తుటిచారు ద్రాగుదున్. 50

(మారుతుని మూఁపునఁ బెట్టుకొని పరుగెత్తుచున్నాఁడు)

మల్లి—(సత్వరముగాఁ జెట్టుచాటుననుండివచ్చి రోదనముతో) భద్ర! రాక్షస! యి గిగో నంజలిపట్టి వేఁడుకొనుచున్నాను. మహాభాగుని విడిచిపెట్టుము. వెండియు నన్నే భక్షింపుము.

రాక్ష—(చెవిని బెట్టక నిష్క్రమించుచున్నాఁడు)

మల్లి—(కన్నీళ్ళతో) అయ్యయ్యో! మహాభాగుని రాక్షసుఁ డెత్తుకొనిపోయినాఁడు. (సకరుణముగా) హా! సకలలోకలోచనచకోరవారపూర్ణచంద్ర! హా! కందర్పమ నోహరాంగ! హా! సుజనచూడామణీ! హా! పుండరీకలోచన! హా! లక్ష్మీమవిహా రభవన! హా! మల్లికాహృదయవల్లభ! హా! మారుత! సర్వలక్షణలక్షితమైననీక మనీయవిగ్రహము రాక్షసాహారమగుచున్నదా నాథా? అయ్యో! నేనెంతపాపా త్మురాలను! ఎంతయదృష్టహీనురాలను! కష్టా! దైవోపహతురాలను గదా! సర్వా నర్థములకు మరల మరల నేనేకారణ మగుచున్నదానను. (నిట్టూర్పు పుచ్చి) నా

బ్రతు కింక నిరర్థకము. అయ్యో! మరణము కూడ నాకు దుర్లభ మయినది. భగవతీ! భూతధాత్రి! నాకు వివరమిచ్చి నీలోనికిఁ దీసికొమ్మ. కటకటా! సకలభువనమును గాలాంజననీల మయినకటికచీఁకటి క్రమ్ముకొని యున్నది. నేనెక్కడకుఁ బోగలను? ఎవ్వరికి మొఱ్ఱ వెట్టుదును? హా! దిక్కుమాలినదాన నయితిని గదా! (రోదనము చేయుచున్నది)

(తొట్రుపాటుతో మందాకిని ప్రవేశించుచున్నది)

మందా—బిడ్డా! భయపడకు. భయపడకు.

మల్లి—(చూచి కన్నీళ్లతో) అమ్మా! భగవతి! భగవతీ! రక్షింపుము రక్షింపుము.

(పాదములమీఁదఁ బడుచున్నది)

మందా—సకరుణముగాఁ గౌఁగిలించుకొని

చ. తెలిసితి జ్ఞానరూప మగుదృష్టికతంబున భీరుబాల! మీ
యలవ్యసనానుబంధము సమస్తము; కస్తిని బొంద కిం కిటక్;
విలయము గాంచురక్కసులు; వేగమ చీఁకటి విచ్చెనొం గ్గగున్;
తొలఁగును రేయి; దైవమును దోడగుఁ గ్రమ్మఱ! భద్ర మయ్యెడున్. 51

మాజేయుఁడు మారుతుఁడు రాక్షసహస్తగతుఁ డయ్యె నని సంతాప పడకుము.

తే. గీ. భవ్యశౌర్యవిడంబితసవ్యసాచి। మారుతుఁ బరాభవింపంగ లే రసురులు;
ప్రాక్కుధరజృంభమాణాంశుబాలభాను। దట్టమగుచీఁకటు లరికట్టఁ గలద?

(తెరలోఁ జటచటధ్వని)

మందా—(చూచి యానందముతో) మారుతపరాక్రమ మెఱుఁగనిదానా! మల్లికా! మహాభాగుని చండిమను చూడుము.

క. మూఁపుననుండి భయంపడ। కాపిశితాశనునిశిరము నతఁ డసిఁ దునిమెన్
గైపునఁ గరికుంభము వ। జ్రోపమనఖరాంకుశమున యువహరి వోలెన్. 53

మల్లి—(హర్షముతోను భయముతోను జూచుచున్నది)

మందా—(ఆనందముతో)

చ. అసిహతమస్తకుం డగుచు నద్దిర! బిత్రుదువం ధరాతలం
బసురుఁడు వజ్రఘాతదళితాద్రితటంబును బోలెఁ గూలెడున్
(ఆశ్చర్యముతో)
విస్మృతపుఁ దక్కుబంధమున వెల్వడి యుజ్జ్వలభూషణుండు మిన్
దెసఁ బురుషుం డొకం డహహా! దివ్యశరీరము దాల్చి యేగెడున్. 54

మల్లి—(విస్మయానందములతో) భగవతీ! యిది మహాశ్చర్యము! అతిభీషణం డగు రాక్షసునివలన దివ్యపురుషుండు బయలు వెడలినాడు. చూడు. చూడు. ప్రదక్షిణము చేసి ఫాలప్రదేశసంఘటితాంజలిపల్లవపుటుండయి మహాభాగునకు నమస్కరించుచున్నాడు.

మంద—(ఆలోచనతో) ఎవఁడో దివ్యపురుషుండు శాపవశమున రాక్షసుండయ్యెనని తలంచెదను.

(తెరలోఁ గలకలము ఇష్టలును వినుచున్నారు)

మల్లి—(భయముతో) భగవతీ! రాక్షసభయంబునం జేసి మరల రాక్షసుండే వచ్చుచున్నాఁడని తలఁచుచున్నాను.

మంద—(చూచి) బిడ్డా! యిదిగోఁ గన్నీరు విడుచుచున్న నీతండ్రి నమాత్యవిశ్వాసునిఁ బురస్కరించుకొని నిన్ను వెదకుచు పెదవంపుఁ గ్గిగువులు గ్గికొని పీఁదపురుషు లిటు నటు సర్వత్ర దిరుగుచున్నారు.

(మరలఁ దెరలో) హా! పుత్రి! మల్లికా! యింద్రనీలప్రకాశముఁ జూచి కహాచఁ జేఁ కటి యని జడిసెడుదానవుగదా తల్లీ!

మల్లి—(కన్నీళ్ళతో) అయ్యో! నాయనగారేడ్చుచున్నారేమిచేయుదును?

మంద—బిడ్డా! నిన్నుఁ గానక దుఃఖపడుచున్న మీతండ్రిగారినూఱడించి, నీకుఁ బ్రాణదానమహోపకారము చేసి విజయమున వర్తిల్లుచున్న మారుతునిఁ గూడ సంభావింతము రమ్ము. (నిష్క్రమించుచున్నారు)

—— గద్య ——

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదసమాసాదితసరసకవితాధురంధర వఙ్గాది సాగరవం
శజశ్రీనీలాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్రహరితసగోత్ర గుణక
వంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల నూరపరాజప్రధానతనూ
భవ విబుధవిధేయ సుబ్బారాయనామధేయాంధ్రీకృత
మల్లికామారుతప్రకరణమునందుఁ బంచమాంకము.

సమాప్తము.



శ్రీరస్తు.

# మల్లికామారుతప్రకరణము.

## షష్ఠాంకము.

---

(తరువాతఁ గాషాయాంబరయుగళీహస్తుఁ డొకపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు)

పుర—(హాస్యముతో) ఓహో! బృహస్పతిని బరిహసించెడు తననయప్రభావముచేత మల్లికాకరగ్రహణమంగళమును సులభపఱుచుకొనుచున్న మాశంబరకప్రభువుగారి యెడల నమాత్యవిష్ణురాతుఁడుగారిపుత్త్రుఁడగురుద్రరాతునికి స్నేహానుబంధ మత్యధికము గదా! అందుచేతనే సన్నిహిత మైనయీవివాహమహోత్సవమునందు సంభావితు లగుమహాజను లిఱుకాటము పొరయక సుఖముగా వసించుటకయి నిజమహాభవనమునందుఁ గొంతభాగము వారికి విడిదకూడ నొసంగినాఁడు. ఇంతియ కాక తండ్రి యయినవిష్ణురాతుఁడు గారికి సమ్మతము కాకపోయినను దా నాయనను సరకు గొనక తనసోదరిని రమయంతిక నార్యకలవింగకుని కియ్యఁ జూచుచున్నాఁడు. (నవ్వి) సోమపరఃకూలమునఁ జూచినదే మొదలుగా నార్యకలవింగకునకి రమయంతికయందు ననురాగము వర్ధిల్లుచున్నది. దానం జేసియే కదా యతఁడు సవికారము లయిననయనాంచలములతో నమ్మించుఁబోణిని మరల మరలఁ జూచుచున్నాఁడు. తానుగ నెట్టయెదుటికిఁ బోయి యే మేమో సల్లాపించుచున్నాఁడు. తా నేవో ఘనకార్యములు చేసినట్లు తననోటితోనే యామెయొద్దఁ జెప్పుకొనుచున్నాఁడు. (పక్కున నవ్వి) ఇతఁ డిన్నిపాట్లు పడుచున్నను నామెకుమాత్ర మితనిమోము విషప్రాయము. చూడ గిట్టదు. (విమర్శించి) కానున్నది కాఁగలదు? ఆర్యకలవింగకుఁడును రమయంతికను సర్వథా పొందఁగలఁడు. అఘటితఘటనైకసిద్ధవిద్యురా లయినమందాకినీభగవతిని నానావిధసత్కారములుచేసి శంబరకప్రభువుగారు తమపక్షమునకుఁ ద్రిప్పుకొనుచున్నారు గదా! ఆతల్లి నిశ్చయముగాఁ దలఁచుకొన్నపక్షమునకుఁ దామరకును జంపమామకును బరస్పరానురాగము గలిగింపఁ గలదు. చెంగలువ నయినను వేవెలుంగుతో సంఘటింపఁ గలదు. ఇది గోఁ! క్రొత్తగా వికసించుచున్న మోదుగుఁ బువ్వువన్నె గలిగినయీమెత్తనిసన్నకావిదువ్వలువ లామె కిచ్చుటకే గదా ప్రభువుగారు నాచేతఁ బంపినారు. వివాహమంగళోపకరణవ్యాపృత యయినభగవతిని జూచుటకయి, విద్యుద్వితానతానమువంటి కాంచనాగ్నిసంభవములైనట్టి నెత్తినాపింగ్గోపుసముచే దీపింపఁజేయు నమాశ్వనిశ్వ

వసుఁడుగారి యీమహాభవనమునఁ బ్రవేశించెదను. (ప్రవేశమభినయించి ముం దుచూచి) ఇదిగో! రమయంతికకుఁ బ్రియసఖి యయినమధురిక లోఁగిటిలోనుండి యీలాగున వచ్చుచున్నది.

మధు—(ప్రవేశించి యానందముతోఁ దనలో) ఆహా! యనితరసాధారణమతిప్రభావ యగుమందాకినీభగవతి శంబరకవంచనోపాయము ననవద్యముగాఁ గనిపెట్టినది గదా! (నిశ్వసించి నిర్వేదముతో) అయ్యో! రమయంతికను రుద్రరాతుఁడు సహజశత్రువు గాని యన్నగాఁడు. మర్కటమునకు మల్లెపువ్వులదండవలెఁ గలవిం గకునకు నీమె నీయఁ జూచుచున్నాఁడు. ఇందుకుఁ గూడఁ దెలియఁదగినయు పాయముఁ బ్రియసఖికిఁ బోలె భగవతి నాచెవిలోఁ జెప్పియే యున్నది. (పురు షునిఁ జూచి) ఇప్పు డేకగృహనివాసపరిచయమువలన వీఁడు శంబరకపరిజనుఁ డ యినచపలకుఁ డని నేను దెలిసికొనుచున్నాను.

పురు—మధురికా! భగవతి మందాకిని యెక్కడ నున్నదో నీకుఁ దెలియునా?

మధు—(తనలో) వీఁడు భగవతిని వెదకుచున్నాఁ డేమి? కానీ అడిగెదను. (ప్ర కాశముగా) చపలకా! భగవతి యెందుకు?

చప—(నవ్వి) ముద్దలారా! యనుల్లంఘనీయ మయినయాకాశభాషితమును బ్రతిపా లించుటకయి శంబరకప్రభువుగారి కామె సర్వవిస్రంభపాత్ర మయి ప్రవర్తిల్లుచు చున్నది కాదా?

మధు—(తనలో) తల్లీ! భగవతి! నీవంచనప్రభావమునకు నమస్కారము.

చప—(తనలో రమయంతికావృత్తాంతముఁ జెప్పెదను. (ప్రకాశముగా) ఇప్పు డావశ్యకముగా భగవతిని సందర్శింప వలయును. అన్నగా రగురుద్రరాతుఁడు తన్నుఁ గలవింగకునకు నిచ్చినను మంకుఁదనమున నాతనిఁ బెండ్లియాడ రమయంతి క సమ్మతింపక యున్నది. కాఁబట్టి భగవతి యామెమొండితనమును మానింప వలయును.

మధు—(సోపహాసముగాఁ దనలో వానియాసకాల! అకలవింగకుని పరిశ్రమమున కు భ్రమరకచరణతాడనమే తుదకు ఫల మగును లే. (ప్రకాశముగా) చపలకా! రమయంతిక నొడఁబఱచుట యనఁగా భగవతి కది యెంతపాటపని? (తెరలో) నవమాలికా! యాలసించెద వేమి? కమ్మనిపరిమళము నోఁ దెమ్మెరలు వీతెం చె డుకతమున నతిమనోహర మయినలీలోద్యానమునఁ బ్రవేశించి యెంతసేపటినుండి యో మాల్లిక నీరాకను బ్రతీక్షించుచున్నది. నీవు త్వరితముగాఁ బోయి యేమి కాఁ

తమున వివాహోచితము లయినమంగళభూషణములను సవిశేషముగా నామె కిప్పు డలంకరింపు మని భగవతి నీ కాజ్ఞాపించుచున్నది. పెండ్లివారు రాక మునుపే నీ వీపని నెఱవేర్పవలయును జుమీ.

మధు—(తనలో) ఇది మంచిదే. మారుతుఁడు గూడఁ గలకంఠభ్రమరకసహాయుఁ డయి యిక్కడనే యున్నాఁడు. అతనిని నిగూఢముగా నక్కడకు సారసిక తోడుకొనిపోయినది గదా! ఇఁక నేనును దగినసంవిధానముఁ బ్రవర్తించెదను. (ప్రకాశముగా) చపలకా! యిదిగోఁ గంచుకులు భగవతి యాదేశమును జరుపుచున్నారు. ఆమె చేరుననేయున్నది సులభముగా సంవర్తింపవచ్చును బొమ్ము. (నిష్క్రమించుచున్నాఁడు. ప్రవేశకము)

(తరువాతి మారుతుఁడు కలకంఠుఁడు భ్రమరకుఁడు ప్రవేశించుచున్నారు)

మారు—భ్రమరక! మల్లిక యీచేరువ లతామంటపము నడుమ నున్న దన్నమాట సత్యమగునా?

భ్రమ—ప్రభువా! కాళిందీనవమాలికలు మంగళాలంకరణమును జేయుచుండఁగా నామెను జూచినాఁడ నని మనవి చేసితిని గదా!

మారు—(నిట్టూర్పుతో)

శా. దేనిం బొంద నసహ్యమన్మథరుజార్తిం గూరి మున్ గోరితిన్,
దేనిం గాంచుట దుర్లభం బనెనుభీతిం బ్రాణనైరాశ్యమే
యే నట్లొందితి, నట్టిజీవితఫలం బిప్డుఁ గరప్రాప్త మ
ట్లౌ; నంబా! భవితవ్యతా! మరల నెట్లావిర్భవింతో గదా!

కల—మిత్రుఁడా, సంశయింపకుము. గొంతు గోసికొనుట కయిన జంకు లేక నీవు సాహసింపఁగా మల్లిక నీచేతిలోఁ బడినది గాన జీవితఫలము భవానీప్రసాదమువలన నీకుఁ గరప్రాప్తమే.

భ్రమ—ప్రభువా! లతామంటపమునకు మార్గ మీవల్లికాదళముల నడుమనుండి.

మారు—భ్రమరక! యీప్రదేశము దట్టంపుటాకుజొంపముల గుబురయినతీవలగుంపుకతమున జీబుకొని యున్నను బరిజను లెవ్వరయిన వత్తురేమో యనుజంకున నెమ్మది కొంతకాలు గదలింపఁ జాల కున్నాను.

భ్రమ—ప్రభువా! భగవతి యాజ్ఞచేతఁ బరిజనమును వేత్రహస్తు లుద్యానవనమునకు దవ్వులనే యాటంకపఱిచి యున్నారు.

మారు—(హర్షముతో) ఓహో! భగవతినీతి సర్వత్ర యప్రమాదిని గదా! దారి చూపుము.

భ్రమ—ప్రభువా! యిటు. ఇటు.

(అందఱు నడుచుచున్నారు)

కల—(చూచి) ఓహో! యమాత్యవిశ్వావసుఁడుగారిభవనము ప్రత్యాసన్నవైవాహికమంగళమును సూచించెడు నుదాత్తమండనవిధానముచేత నెంతచక్కఁగా శోభిల్లుచున్నది!

ఉ. తేనియ లుట్టు ద్వారముల దిద్దిరి వందనమాల లుంచి రిం
పైనవి క్రొత్తచిత్తరువు లచ్చపుమేడల గోడలందు, సం
ధానమొనర్చి క్షౌమపువితానములందు సుహాణిజల్లులన్
మానుగ వీథివాకిట నమర్చిరి బంగరుఁగాయమానముల్. 2

మఱియు—

ఉ. లీల నళింపకేతుపటలీపట పల్లవముల్ గదల్చుచున్,
దాలిచి తోరణప్రసవదామసుగంధమరందబిందువుల్,
గాలులు వీచు వల్లవిచలత్కుచకుంకుమఘుష్ణవేగసాం
దోలనచేటికామృధులదోర్వలయధ్వను లాహరించుచున్. 3

భ్రమ—(చెవి యొగ్గి) ప్రభువా! కేవల మిది వలయధ్వనియే యనియెద నేమి? అటు నిటుఁ బ్రధావించెడు వారసుందరులనితంబబింబముల వ్రేలుచున్న మణిమేఖలాసహస్రముల ఝణఝణత్కారంబులఁ దోరంబయి, ఘూర్ణమానసకలాంతఃపురజనంబుల భూషణారావంబులఁ బూరితంబయి, గుంజన్మంగళమృదంగశంఖకాహళాది నినాదంబుల నిర్భరంబయి, సన్నిహితమహితభూదేవవర్గసంపఠ్యమానపుణ్యాహఘోషంబున మాంసలంబయి, వృద్ధకులాంగనాజనసమారబ్ధంబులైనపవిత్రపార్వతీలక్ష్మీకల్యాణగానంబుల ననూనంబయి యీయుత్సవకోలాహలము మహీయము గానున్నది గదా!

మారు—(నిశ్వసించి) సఖా! కలకంఠ!

క. రమణీమణికిం బరిణయ। సమయము ప్రాపించుకొలఁది సాన్నిధ్యము, చి
త్తము సంశయడోలారూ। ఢ మగుచు నూఁగాడఁగాఁ దొడఁగెడు గాఢన్. 4

భ్రమ—ప్రభువా! లతాభవనసమీపమునకు వచ్చినారము.

మారు—(సంతోషముతో) మల్లికావాససుభగమయినలతాభవనమా యిది?

కల—ప్రసాధనసమయసంభావ్యమయి క్షణోత్పన్నవిరత మయ్యెడుభూషణఝుంకారము వినఁబడుచున్నది గదా!

భ్రమ—ప్రభువా! మంగళస్నానవిశుద్ధముగ్ధ మయినపరిక్షామపాండురాంగంబుచే సవిశేషలోభనీయదర్శనయుఁ బ్రసాధననిపుణనవమాలికానిర్వర్తితవివాహనైపథ్యమధురోదారవేషయు నయి సాక్షాత్కరించిన యుద్యానలక్ష్మివలెఁ దీఁగలసందులనుండి యదిగోఁ బూజ్యురాలు గనంబడుచున్నది.

కల—(పత్రజాలకాంతరమునుండి విలోకించి) మిత్రుఁడా! చూడు చూడు.

మ. ఇది సుక్షామమనోహరాంగకము లెంతేఁ గాంతిపూరంబులన్
వెదచల్లన్ నయనాంబుజంబులకు నుద్వేలప్రమోదంబుగాఁ,
గొద లేకట్టివిభూషణంబులు హరంగుంబెంపఁ గల్యాణి యీ
పొదరుందీవలయొద్దఁ దాను నొకపూవుందీవ యై భాసిలున్. 5

మారు—(ఆనందముతోఁ జూచి) ఇదిగో నీమె క్రొంచెముగా మోము పెడమరల్చినది. కాళిందీనవమాలికలతో నేమో సల్లాపించుచున్నది సుమీ. మన మీతీఁగలసందుమనుండి ప్రవేశించి రహస్యముగాఁ జూతము. (అట్లు చేయుచున్నారు)

(తరువాత ముందు చెప్పినట్లు మల్లికయు, నవమాలికయుఁ గాళిందియుఁ బ్రవేశించుచున్నారు)

మల్లి—సఖులారా! మీవిప్రలంభవచనముచేతనే నే నీయలంకారమున కనుమతించితిని.

నవ—సఖీ! నీవు వేఱుగాఁ దలంచుకొనకుము. (మారుతునిఁ జూచి సంతోషముతో జనాంతికముగా) కాళింది! మహాభాగుఁడు వచ్చి వెనుక నున్నాఁడు. వెల్లడింతమా? ప్రియసఖికి సత్యమని నమ్మిక పుట్టును.

కాళిం—సఖీ! వెల్లడింపకు. సమయము వచ్చినప్పుడే వెల్లడింపవలయును.

నవ—(చిఱునవ్వు నవ్వి) సఖీ! మల్లికా! నీవు మమ్మును వంచించితివి గదా!

మల్లి—(అనుతాపముతో) ఎప్పుడు?

నవ—సఖీ! రాత్రివేళ మమ్ముఁ గూడఁ గన్నుమొఱఁగి ప్రాణపరిత్యాగమునకుఁ బ్రయత్నించినదానవు కావా?

మల్లి—(సిగ్గుపడుచున్నది)

కాళిం—అదృష్టవశమున వెంటనే రాక్షసునిచేత గృహీత వయి మహాభాగునిహస్తమునందుఁ బడినదానవు.

కల—సఖా! మల్లిక పడినచోటనే నీవుండుట యెట్లు తటస్థించినది?

మారు—మిత్రమా! నే నుపవనాంతరమునఁ బ్రవేశింప నెంచియుఁ గాలు దొట్రిలినం దున సంశయించి యక్కడనే నిలువఁబడితిని.

మల్లి—కాళింది! రాక్షసుఁడుగాఁడు. ఎవ్వఁడో యొకదివ్యపురుషుఁడు. అతఁడు మహాభాగునకు జన్మాంతరమిత్రుఁ డని భగవతి నాకుఁ జెప్పినది.

(ఇద్దఱు విస్మయపడుచున్నారు)

కల—సఖా! యేవపురాక్షసజన్మమునుండి యాయనను నీవు విడిపించితివి గదా! ఆ మహాపురుషుఁ డెందుఁ బోయినాఁడు?

మారు—అతఁ డత్యంతసౌహార్దమున నాతోడ మాటలాడి సఖుఁడా! నీవు నన్నుఁ దలంచుకొన్నతోడనే నీయొద్దకు వచ్చి నీయభిమతమును నేను నెఱవేర్చి పోయెద నని పలికి వెంటనే తిరోధానము నొందెను.

నవ—కాఁబట్టి నీవే విప్రలంభశీలవు.

మల్లి—నీయుపాలంభ ముచిత మయినదే.

నవ—సఖీ! నీ కీయలంకరణ మనుకూలముగా నున్నదో లేదో చెప్పు.

మల్లి—(సిగ్గుతో చిఱునవ్వుతో) సఖీ! యిది నాయలంకారము గనుక సిగ్గున నిస్టిది యని ప్రశంసింపఁ జాలకున్నాను. ఇంతియకాని నీప్రసాధననైపుణి వాగతీతము.

కల—వాగతీత మని మల్లిక చక్కఁగాఁ జెప్పినది. ఇం దొక్కొక్కటే వర్ణనము నతిక్రమించుచున్నది. ఇ చూడు—

తే. గీ. వలచునభినవకుంకుమపంకమునను। దిద్దుమదిరాక్షి ముద్దులతిలక మొప్పు;

మారు—(అభిలాషతో)

రక్తమై రమ్యవదనాబ్జసక్తమై య। చంచలత నిల్చుమామకస్వాంతమట్లు. 6

కల—(చిఱునవ్వుతో) సఖా! నావచనమును నీ వపహరించితివి.

భ్రమ—అయ్యా! చూడు చూడుఁడు ప్రభువుగా రొసంగిన హారయష్టి యీ మెకంఠ మూలమును జుట్టుకొని యున్నది

కల—(చక్కఁగాఁ జూచి) నిజముగా నిది వయస్యదోరంతరవిహారమగ్న [illegible] కుయిన హారవల్లియే. (విమర్శించి)

మ. స్మరదాహంబునఁ బాండుమూల మగుచున్ శంఖంబు [illegible] బుదా

హ యింపం గలకంఠకాండమున నీహారంబు [illegible];

మారు—

హరి [illegible]క్షీవదనంబు నిక్కముగ నేణాంకుండుగా నెంచి [illegible]

చరమందుండి యుదక్ప్రకాండము భజింపఁగోరి యేతెంచె నాన్. 7

కల—(సశ్లాఘముగా) నీప్రతిభోత్కర్షము సర్వోత్తరముగదా!

మాధ—సఖా! సముదారవిరచితనీలధమ్మిల్లగర్భకగ్రథితమాలతీకుసుమసౌరభ్యలుబ్ధ ఇందిందిరసుందరీమధురసమారబ్ధమంగళసంగీతకంబును, ననర్ఘతాటంకకిరణపల్లవితకోమలకపోలవిన్యస్తపత్రలతాకులంబును, నతిసురభిహిమజలశబలకుంకుమఘనసారసరసాంగరాగకలితఘనతుంగకుచకుంభాభోగప్రేంఖోళహారజాలంబును, నిబిడనితంబమండలమండితకాంచనకాంచీగుణపద్మరాగమయూఖపుంజమంజిష్ఠారంజితమంగళక్షౌమంబును, నాముక్తమౌక్తికనూపురకిరణకృత్రిమహంససంసేవితచరణపుండరీకంబును నై నయనాభిరామ మయినయీమెవైవాహికనైపథ్యము సకలఁ తిభామారసుసుమా. (బాగుగఁ జూచి) అయిన నీయనవద్యాంగికి నలంకారములు పునరుక్తములే. చూడు—

మ. నయనప్రాంతవతంసితశ్రుతిపుటిన్ వ్యర్థంబు నీలాబ్జ మే
క్రియ హారంబుగాఁ భారము స్మితశ్రీఁ దాల్చుచందోయి నవ్యయరాగాంఘ్రియుగాతిబాధకము పిండాలక్తపాతంబు; ని
శ్చయ మీసాజపుఁ గమ్మతావి మెయికిం జల్యల్ వృథాయాసముల్. 8

భ్రమ—పాపటయందుఁ జూడామణి కనఁబడ దేమి?

నవ—సఖీ! నీయవయవలక్ష్మిచే నలంకృత మయినమంగళాలంకరణము నీరత్నముకురమునఁ జూచుకొనుము.

(ఎదుట నద్దముఁ గనఁబఱుచుచున్నది)

మల్లి—(సిగ్గుతోఁ జూచుచున్నది)

మాధ—సఖా! చూడు—

మ. ఎలప్రాయంబున మీరుపోయగఁ జూచే నీముజ్జగంబందుఁ జి
ల్కలకొల్కుల్ గల రెంద ఱేని, యయినం గానన్ యథార్థంబుగాఁ
జెలువంపు గని యైనయీకలికికిన్ సిద్ధోపమానం బెటన్;
నిలువుంపర్ణరత్నమం దొదవునీ నీడం జుమీ చూచితిన్. 9

నవ—సఖీ! స్వభావస్నిగ్ధము లయిననీలనయనోత్పలముల భేదము గానరానికాటుకరేకతోడను, ముగ్ధమధూకధవళ మయినగండమూలమున గుణోత్కర్షము గాంచుచున్నకస్తూరికాపత్రలతలకతమున విభావిత మగుశోభాతిశయముతోడను, గౌరిచరణలగ్నలాక్షారుణశంకరశీర్షచంద్రరేఖను బ్రతివచ్చెడుమనోహరకుంకుమతిల

కాంచితరమణీయలలాటము నీటుతోడను, గండళితకందర్పప్రతాపాంకురశంక నుత్పాదించెడును దారసీమంతపథవర్తి సుందరసిందూరముతోడను, సకలలోచనానందసంధాయక మయి చంద్రమామకు సాటి వచ్చెడు నీమోముఁదామరను నీవు గూడఁ జూచుకొనుము.

మల్లి—సఖీ! నవమాలికా! నాకు శిఖామణి యేల పెట్ట నయితివి?

నవ—సఖీ! మఱచితివా? రాక్షసహస్తమునుండి జాతిపడినప్పు డది మరలఁ గ్రింపఁ బడిపోయిన దని నీవే చెప్పితివి గదా!

మారు—అయ్యో! శిఖామణీ! మరలఁ గ్రింపఁ బడిపోయితివా?

తే గీ. ఎట్టెటో యీమె పొందు నదృష్టవశత
మరల మరలను గొండొక పొందియునీవు
మానికమ! నాకుఁ బోలెను మాటి కకట!
కలుగుచున్నది యెడఁ బాటు సులభముగను.

(తెరలో) నవమాలికా! త్వరపడు త్వరపడు మండనవిధి నిర్వర్తింపుము. (అందఱు వినుచున్నారు)

కాళిం—సఖీ! భగవతి వేగిరించుచున్నది. పోదము. ఈవివాహమంగళారంభము నీవు పొందఁ దగినది గదా!

మల్లి—(విషాదముతో నిశ్వసించి తనలో) అయ్యో! నాప్రాణమును గాపాడుటకు మాత్రముపయోగించెడుమాట లాడుచుఁ బ్రియసఖులచేత మోసపోయితిని, కటకటా! నిష్కరుణారంభ మయిన నిష్ఠురగగనవాణీదుర్విపాకముచేత నాజన్మఫల మపహృత మయినది. హా! మందభాగినిని నే నిప్పు డేమి చేయుదును? వెంటనే నన్నా క్రూరరాక్షసుఁ డేల భక్షింపఁ డయ్యెను? అయ్యయ్యో! దురదృష్టవంతురాలను నిరాలంబ మయిన యాకాశమునుండి క్రిందఁ బడినప్పుడు మగ్గనూచ మేల కానయితిని? (స్మరించి మరల నిశ్వసించి) అయ్యో! యట్లు కంఠదేశమునఁ గఠోర ఖడ్గము నుంచుకొని జీవితపరిత్యాగమునకుఁ బ్రయత్నించిన యామహాభాగుఁడు నానిమిత్తమిఁక నేమి గా నున్నాఁడో?

నవ—(జనాంతికముగా) సఖీ! కాళింది! పాపము! నిజము లియక ప్రియసఖి మనవవ్వటాలచే నధికవ్యథ నొందుచున్నది. (ప్రకాశముగా) భర్తృదారికా! ప్రత్యుత్తర మీయక యూర కుంటి వేమి? నీయారుప్రాగాలు లేల దీర్ఘోష్ణము లయి యెఱ్ఱనిమోవిచిగురు ను గములించి పయ్యెద చెఱఁగు నల్లలార్చుచున్నవి? సఖి

టి కీబాష్పస్తబకములు నీచెక్కుటద్దముల వ్రాసినపత్త్రలేఖలను జెఱిపి కాటుక గరంగఁ గాలువలు గట్టుచున్నవి?

మల్లి—(నిశ్వసించి) సఖీ! నవమాలికా! మనోరథసహస్రములచేత సంవ్రత మయి నన్నాప్రియవస్తువును విఘటించునిష్ఠురవిఘ్న మనియెడుమృత్యుదేవతకుఁ ద్రుకను జొచ్చి బాధపడుచున్నదానినిగా నన్నెఱింగి యుండియు నీవు గూడ నిట్టులాయా నప్పెట్టెద వేల? (నిర్వేదముతో) జీవితనిర్విశేషురాం డ్రగుప్రియసఖుల కిది యుక్తమే. ఇంతవఱక నయ్యయి విప్రలంభవచనములచేతఁ బ్రతారించి యిప్పుడు వెండి యు న న్నాహేయపుఁగుంభీపాకమునఁ గూలఁ ద్రోయఁ బ్రవర్తించెదరు.

కల—వయస్య! నీసౌభాగ్యమును జూచుకొనుము.

ఉ. ఈమె ప్రియాళివాక్యముల నెంతయు నమ్మి భవత్సమాగమా
శామిళదాత్మ, ముగ్ధ, తను జక్కఁగమున్ గయిసేయ నిచ్చి, యి
చ్చో మది బాష్పకంఠి యయి గ్రుక్కెడు నన్యవివాహసంశ్రుతిన్,
లో మొగులుం దలంచి దిగులుం గను బాలమరాళిపోలికన్. 11

నవ—(సకరుణముగా, జనాంతికముగా) కాళిందీ! మనసులోని దుఃఖము చేత నతివి షమ మయిన భర్తృదారికావచనము నాలకింపుము.

క. అనుకూలవిప్రలంభము! లను మన మొందింప నుమ్మలము సన్నేహం
బును సవిషాదము సోల్లుం! ఠనము సధిక్కారమునుగ నాతి పచించుచున్. 12

(ప్రకాశముగా) సఖీ! యీమావిప్రలంభవచనమునకుఁ గినియకుము. ప్రసన్నవు గమ్ము. (మారుతునిఁ గడకంటఁ జూచి) నీయందు సవిశేషబద్ధానురాగుఁ డయిన యీయనకు నీకరకమలము నొసంగుము. బంధువర్గము నానందపఱుపుము.

మల్లి—(శోకభారముతో) సఖులారా! తరుణమయూరపింఛమువంటి నిద్దంపుఁ జామనచాయ గలమంగళాంగమున నెసంగుమహాభాగుని మారుతుని సందర్శించినది మొదలు లన్యపురుషునిఁ దలంచి యేని యెఱుంగను; కాఁబట్టి సత్యప్రమాణముగాఁ జెప్పుచున్నాను. విను. మహాభాగునిపూర్ణలావణ్య మనెడుభాగీరథీప్రవాహమున న వగాహనము గావించుటచేతఁ బవిత్రము లయిననానేత్రములతో లాఁతివాని నిఁక ముందును జూచువాడను గాను.

కల—మిత్త్రుఁడా! యీవచనామృతమును వీనుజేరలతో జుఱ్ఱుకొనుము.

మారు—మదీయమానసవిహారమల్లికాక్షి! మల్లిక!

చ. హృదయమునన్ నిరూఢ మగుప్రేమరసాతిశయంపునూత్నపు

స్నది కడుఁ బొంగి పైఁబొరలు నా, హృదయంగమ మైనపల్కులన్
మదనమహాగ్ని దగ్ధుఁ డయి క్రమ్మఁ దెడు నా కమృతాభిషేకసం
పద గలిగించిన ట్లయితి; ప్రాణము వచ్చెను బ్రాణనాయికా. 13

(మరలఁ జెరలో) వనమాలికా! త్వరపడుమను చున్నారు. సిద్ధాంతులు పెట్టిన వివాహ ముహూర్తము సమీపించుచున్నది.

(అంపము వినుచున్నారు)

మల్లి—(కన్నీళ్ళతో) అమ్మో! భగవతి మరల నాజ్ఞాపించు చున్నది. సఖి! వన మాలిక! లే లెమ్ము. భగవతి తాను గానే యిక్కడకు వచ్చెనేమో; ఇంతలోనే వే ఱొక లతావలయమున కరిగి మి మ్మొక్కటి ప్రార్థించెదను.

వన—సఖీ! నీ వాజ్ఞాదానయోగ్యురాలవు. ప్రార్థించుట యేమి? నుడువుము నీయిచ్చ వచ్చినకార్యమునందు యథేష్టముగా నియోగించి భగవతి యాదేశమును నిర్వ ర్తింపుము.

మల్లి—సఖి! విషాదసంభ్రమములచే నాదేహము కంపించుచున్నది. కాఁబట్టి నేను లేవలేక యున్నాను. నాకన్నదోయి బాష్పపూరము గప్పుచున్నది; నే నిను చేతఁ జూడను సయితము చాలకున్నాను. నీవే నాచేయిపట్టుకొని లేవఁ దీసి మెల్ల గా లతావలయాంతరమున నన్నుఁ బ్రవేశపెట్టుము. (చేయి చాఁచుచున్నది)

సఖులు—సంజ్ఞచేఁ బాణిగ్రహణమునకై మారుతునిఁ బ్రేరించుచున్నారు)

మారు—(భయము నభినయించుచున్నాఁడు)

కల—మిత్రుఁడా! యిది సాధ్వసమునకు సమయము గాదు. చిరకాంక్షిత మయిన మల్లికాపాణిగ్రహణమహోత్సవము ననుభవింపుము.

మారు—(లతావలయమునుండి వెడలివచ్చి మల్లికపాణిని గగుర్పాటుతో గ్రహించు చున్నాఁడు)

మల్లి—(హర్షముతో) సఖీ! వనమాలిక! నీహస్తస్పర్శము వేఱుగా నున్నది. చేయి పట్టుకొన్నంతమాత్రమున నాయవయవము లన్నియు నమృతవర్షమునఁ బడిసిన ట్లు సుఖపారవశ్యము నొందుచున్నవి. (మారుతునే యూఁతకొని లేచుచున్నది)

మారు—(బదులు పలుకకయే మెల్ల మెల్లగాఁ దీసికొని పోవుచున్నాఁడు)

సఖులు—(చిఱునవ్వుతో వెంబడించుచున్నారు)

కాళిం—సఖీ! మల్లికా! లతాంతరమునకు వచ్చినారము కాఁబట్టి చెప్ప దలఁచిన దేమో చెప్పు.

మల్లి — (నిట్టూర్పుతో) సఖీ! నవమాలికా! యేతీఁగె మొకటికి వచ్చినారము?

* మారు — బహుళకుసుమరసపరివాహామందరపరిమళలోలలోలంబపుంజబద్ధతిమిర మీ మందారమూలమునొద్దకు.

మల్లి — (సబాష్పగద్గదముగా) ఈమందారము నేను పెంచినదే. కాఁబట్టి నిర్జనమైన యీప్రదేశమునందు మీ మొక్కటి ప్రార్థించెదను.

కాళిం — సఖీ! మే మవధానము గలిగియున్నాము.

మల్లి — ఓ జీవితనిర్విశేష! మారుత! (అర్ధోక్తిని వైలక్ష్యమభినయించుచున్నది)

సఖులు — (పరస్పరము నవ్వుకొనుచున్నారు)

మల్లి — ఓజీవితసర్వ్వశేష! నవమాలిక! సఖీ! కాళింది! పరిపూర్ణచంద్రసుందరాకారుం డగుమహాభాగుని పాదములకు శుశ్రూష చేయుసౌభాగ్య మభిలషించి కదా విఘటమాన మయిననాజీవితమును నిలుపుకొంటిని. ఆకందర్పసుందరుని ప్రథమదర్శనము మొదలిప్పటివఱకును గృహదీర్ఘికారవిందమకరందవాహులయి మందమందముగా వీతెంచెడు నుద్యానవనమారుతములకు నోర్చుకొనుచుంటిని. ప్రచండమకరధ్వజభుజదండమండలితధనుర్దండటంకారఘోరము లయినమధుకరహుంకారముల నాకర్ణించుచుంటిని. చిగిరించినతీయమామిడిగుబురులలో విహరించుచుఁ గోకిలములు గావించెడు పంచమప్రపంచము హాలాహలముచే దురంతము లగువసంతదివసములు వేగించుచుంటిని. ఇంతియ కాక కిసలయతల్పకల్పనములచేతను, మృణాళభంగహారరచనములచేతను, కదళీదళవిచిత్రవీజనములచేతను గర్పూరపరాగచార్చిక్యసంపాదనములచేతను నింకను దత్తదుచితోపచారములచేతను, మిమ్మును గూడ నాయాసపెట్టుచుంటిని, అట్లు రాక్షసహస్తమునుండి జాఱి యాకసమునుండి క్రిందఁబడుచు నిన్నర్ధరాత్రమున నెవ్వనిచేత రక్షితనయితినో యట్టిమహాభాగునిసంగమ మెవరికో పుణ్యాత్ములకుఁ గాక సులభముగాని నాకు దుర్లభమే. కాఁబట్టి నాజీవితధారణము క్షణమేనియు మహాపాతకములలో నగ్రగణ్యమని తలంచెదను. సఖులారా! జన్మాంతరమునఁ బునర్దర్శనము గోరుచు మిమ్ము వీడుకొనుచున్నాను. (సప్రశ్రయముగా నంజలి పట్టి సగద్గదముగా) సఖీ! నానిమిత్తము నీవిట్లు నమస్కరించి సుందరభూలక్ష్మీబంధుఁడును దీర్ఘస్నిగ్ధలోచనపుండరీకుండును నగు నమ్మహాజనుఁడు పరలోకగత నగునాకొఱకు జలాంజలి నిచ్చునట్లు రహస్యమున నాయనతో విన్నవింపవే. (రోదనము చేయుచున్నది)

---

* ఈవాక్యము మూలమందు సంస్కృతప్రాకృతసమానము.

మారు—(సకరుణముగాఁ దనలో)

చ. హరిహరి మేను వాసెదుప్రయత్నముతోడ శుభాంగి తానిటుల్
కరుణమనోహరం బగువిలాప మొనర్పఁగ నాలకించుటన్,
సరళతచేఁ గరంగెడును, జాలిని రూపఱుఁ, గందు మోహవి
స్తరమున, వ్రీలు నాతిఁ, హరుసంబునఁ బొంగెడు, డెంద మిత్తఱిన్. 14

కాళిం—సఖీ! యమంగళము దొలంగును గాక.

నవ—(కన్నీరు పెట్టుకొనుచున్నది)

మారు—(ప్రకాశముగా)

* క. వీణావిరావకోమల! వాణీబంధుగణచిత్తవనజమరాళీ
రాణ నెసఁగుసహచారిణి! ప్రాణమునకుఁ దెగకు పలుక కతికరుణోక్తుల్. 15

నవ—(జనాంతికముగా) కాళింది! మహాభాగుఁడు తన నేర్పుచేత స్వచ్ఛముగా నావలె నే మాటలాడుచున్నాఁడు; కాఁబట్టి యాయన నిప్పటికిని బ్రియసఖి యెఱుఁగదు.

మల్లి—సఖీ! ముద్దరాల! సాహస మనియెద వేమి? ఎవ్వనికి జీవలోక మంతయు మృత్యుమయము కనఁబడుచున్నదో యెవనిహృదయము మదీయలాభభంగమున నతికాతర మయి యడలుచున్నదో, యంతటియర్ధరాత్రమున నట్టిదుర్గమప్రదేశమున కేకాకి యయి పోయి సకలభూమండలమండన మయినతనకంబుసుందరకంధరాకాండము నందు వాఁడు క్రొవాఁడికరవాలముఁ జేర్చుకొనునంతటి మహాసాహసమునకు సిద్ధపడెనో, యటువంటి నాప్రేమనిధికొఱకు జీవితసహస్రపరిత్యాగ మయినను సాహసము కానేరదు. ఈవిషయమున నీవు నాకుఁ బ్రతికూలవు కాకుము. వెండియు మహాభాగునకు నామాట గా నిట్లు చెప్పుము (సగద్గదముగా) నాథ! మందభాగినిని నే నీజన్మమున యుష్మదీయపరిరంభసౌభాగ్యమును బడయ లేకపోయితిని. కాని జన్మాంతరమున నయినను నీపొందే యపేక్షించుచున్నాను. నాతోఁబుట్టువగు నపుష్పమాలికను మాత్రము మరకతకవాటస్నిగ్ధవిశాల మయినమీవక్షస్స్థలమునందు నన్నుఁబోలె సర్వదా ధరించుకొనుఁడు. (మారుతునిఁ దడవుగఁ గౌఁగిలించుకొని యానందముతోఁ దనలో) ఏమిది? ప్రియసఖీసంస్పర్శము మయిప్పుడు మంచిగంధ మలందినట్లయి మహాభాగపరిరంభమునఁ బ్రతి వచ్చుచున్నది. హృదయసన్నిహితుఁడయి సుఖింపఁ జేయుచున్నం నని తలంచెదను. (ప్రకాశముగా) సఖీ! యిది నాకడసారికవుఁగిలింత సుమీ.

---

* ఈపద్యము మూలమునందు సంస్కృతప్రాకృతసమానము.

సఖులు—(చిఱునవ్వుతోఁ దమలో) ఇది కడసారి కౌఁగిలింత కాదు. మొదటిదో రెండవదో.

మారు—(కౌఁగిలింపఁ బడియే యానందముతో సహజస్వరముతో)

ఉ. ఎవఁడు దృఢానురక్తమతి నిందుముఖీ నిను నిచ్చగించునో
యెవనికినై శుభాంగి యును తేఁ త్యజియింపఁగఁ దెంపుఁ జేసెదో

మల్లి—(తనలో) ప్రియసఖికంఠము మాఱిపోయినదేమి? (ప్రకాశముగా) ఆయనయె చ్చట నున్నాఁడు?

మారు—

వివిధవిషాదమారశరవిద్ధభుజాంతరగాఢపీడితా
త్యవిరళపీవరస్తనత హాయిఁగఁ ద్వద్భుజపంజరంబునన్. 16

మల్లి—అయ్యో! మహాభాగుఁడే. (హర్షసాధ్వసలజ్జలతోఁ దొలఁగుచున్నది.)

మారు—

తే. గీ. సాధ్వసంబునఁ దొలఁగకు చంచలాక్షి!
తగునె సంభ్రమకాతర వగుట దాస
జనుఁడఁ? జిరకాంక్షితోత్సవపుఁ గౌఁగి
టికిని భంగం బొనర్తు వటే లతాంగి? 17

మల్లి—(వ్రీడానూయలతో) సఖులారా! నేను బాగుగా వంచిత నయితిని.

కల—(త్వరగా సమీపించి) కల్యాణి! యీలాగున బలుకకుము.

మ. జగదుత్తంసుఁడు నావయస్యునకు భూషాప్రాయ వై తీ వహో
సుగుణాఢ్యా! యెటు విప్రలబ్ధయనవచ్చున్ నిన్నుఁ? ద్వత్ప్రాప్తిలో
భగరీయోమృగతృష్ణికం బడి యదభ్రభ్రాంతి వర్తించు దు
ర్భగుఁ డాశంబరకుండె సుమ్మి పరికింపన్ విప్రలబ్ధుం డిటన్. 18

ఉ. చందనపాదపంబునకు సౌరభసంపదవోలె, జ్యోత్స్న పూ
ర్ణేందునకుం బలెన్, మణికి ఘృష్టియుఁ బోలెను శోభనాంగి! నీ
వందపుసొమ్ము గ మ్మితని కవ్వియు వారికిఁ బోలె నీకు నీ
సుందరమూర్తి యొప్పెడును జూవె సమభ్యుచితావలంబమై. 19

భ్రమ—(సమీపించి) నవమాలికా! మనయదృష్టము మంచిది. ఒడయఁడు నోడ యీరాలు నభ్యుదయమున వర్ధిల్లుచున్నారు.

మందా—(ప్రహృష్టవదన యయి ప్రవేశించి)

తే. గీ. సిరియుఁ బార్వతి, భారతి, సీత, భీమ
జాత, పౌలోమి, రుక్మిణి, సత్యభామ,
కృష్ణ, శర్మిష్ఠ, సావిత్రి, ధృతి నరుంధ
తీ, రమసాధ్వి, యాశీర్వదింత్రు గాక. 20

(అంతటఁ జూచి సాశంకముగా) మల్లిక యీలతాభవనమునుండి యెక్కడికి వెళ్ళిన దో! (లతాంతరముఁ జూచి యానందముతో) అహో! నామనోరథములు ఫలించినట్లే. ఇదిగో! మందారమూలమున మారుతుఁడు—

చ. అతిసుకుమారమూర్తి కృశమునై రమణీయతఁ గాంచు మేనితోఁ
బ్రతిపదుఁడుప్రియుండు సరి వచ్చెడురూపున లోభనీయుఁడై
చతురకటాక్షముల్ స్మరరుజాశబలాక్షము ప్రీతినప్రము మా
వతులితమల్లికాముఖమునం దొలయించుచు నున్నవాఁ డిటన్. 21

(సమీపించుచు) నవమాలికా! యాలసించెదవేమి?

నవ—అహో! భగవతియే వచ్చినది. (ఎదురువోయి) భగవతి! మే మాలసించుట లేదు.

మల్లి—(సగద్గదముగా) భగవతీ! రక్షింపుము. రక్షింపుము. (అంజలిపట్టి వచ్చుచున్నది)

మందా—(మల్లికను కౌఁగిలించుకొని) బిడ్డా!

మ. సమరాగుండు మహాభిజన్ముఁడు జగచ్ఛత్రుప్రియుండౌ జనో
త్తమునందుక్ దృఢరక్త వీవు; పొగడ్తోదం జాలుకల్యాణి! నీ
దుమనోవాంఛ ఫలించుఁ; బుణ్యసులభక్ దో నిన్నుఁ బెండ్లాడి, డెం
దముఁ గందించుచిరాంగజజ్వరముబాధం బాయు నిం కీతఁడున్. 22

నవ—(ఆనందముతో) భగవతీ! సర్వోత్తర మయినతనవిర్మాణవైదగ్ధ్యము చిరకాలమునకు సఫల మగుటచేత విధాత కృతార్థతను బొందుఁ గాక. శంబరకహోతకుని పరిణయప్రసంగముచేతఁ గలుషము లయినబంధుజనహృదయంబులు ప్రసన్నతనొందుఁ గాక. మాతాపితృసమానము లగుమీహస్తములోలనే మహాభాగునిచేతికిఁ బ్రియుఖిసమర్పింపఁ గలయును.

మల్లి—(తనలో) అయ్యో! వారు సర్వమంగళావచనప్రమాణాలు గదా!

మందా—నవమాలికా! నే నిప్పుడు వేఱుగ నర్పింప వలసినదేమి?

తే … క్కచెముకింప కుండంగ రక్కసినిఁ జేతియందుండి తిగిచి రక్షించి యీమె ఘోరఖడ్గంబు మెడఁ బెట్టుకొన్నయితని కరమునం దుంచె సర్వమంగళయె మున్న.

పుట్టుచున్నది.

కల—భగవతీ! యతిప్రసక్తమయిన మీయభ్యర్థనమునకుఁ దగినయుత్తరము మిక్కిలి నిపుణముగ నాకుఁదోఁచకున్నది. చూడుఁడు—

చ. స్థిరపడె స్నేహ మీమె కన, స్నిగ్ధునకున్ సకృదీక్షునకుఁ బ్రే
మ్మరి వశుఁడైయటన్న, ననమంచిత, మయ్యెను భ్రూవశుండె మున్;
సరళత నట్టిఁ డెవ్వఁ డన, సౌహృదవాక్యము; యీమెకోసమై
సరకుగొనండు ప్రాణమున, సర్వము నీమెయె చూచె నానిసిన్. 28

మందా—(సవిమర్శముగా మల్లికను గూర్చి) పుత్రీ! నీకుఁ గూడ నించుక యుపదేశించెదను.

మల్లి—భగవతీ! యానతిమ్ము.

మందా—

ఉ. సేవల నత్తమామలకుఁ జేయుము మెచ్చఁగ మాఁడుబిడ్డకున్;
సేవకులం దయంగనుము, స్నిగ్ధవుగమ్ము సపత్నులం దతి
థ్యావళి సత్కరింపుము; గృహక్రియలందును బద్ధకింప క
మ్మా! వేయి చెప్పనేల? సుఖమందుము సల్పుచుభర్తయిష్టమున్. 29

మల్లి—(సిగ్గుతో మనస్సున నంగీకరించుచున్నది)

నవ—ఇది యుచితమయినయుపదేశము.

మందా—వత్సా! మారుత! తలఁచినప్పుడు వచ్చెదనని నిన్ను వీడుకొనినయాదివ్యపురుషుని మాకందనాముని, శంబరకహతకవంచనార్థము మల్లికావేషమును దాల్చి దయచేయుమని యిప్పుడు సంస్మరింపుము.

మారు—(ధ్యానము నభినయించుచున్నాఁడు)

(తరువాత మల్లికావేషముతో మాకందుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మాకం—సఖా! మారుత! యిదిగో నేను వచ్చితిని. నీయభీష్టము నెఱవేర్చెదను.

(మందాకినీమారుతులు దక్క మిగిలినయాందఱు విస్మయము నభినయించుచున్నారు)

కాళిం—(జనాంతికముగా) నవమాలికా! యీతఁడు మహాభాగుని శాపము నుండి విమోచితుఁడయిన దివ్యపురుషుఁడు సుమా!

నవ—కాళిందీ! యాశ్చర్యమాశ్చర్యము! ఎవ్వఁడు ప్రియసఖి భక్షించుటకు సిద్ధపడెనో యతఁడే యిప్పుడు రక్షించుటకు సిద్ధపడినాఁడు. (మల్లికతో) సఖి! మాకు మఱియొక ప్రియసఖి యెట్లుగలిగినదో చూచితి చూడు.

మారు—మహాపురుష! భగవతి నిన్ను మున్ను కోరినదాని నాచరింపుము.

మాకం—చక్కగా నాచరించెదను.

[కాషాయాంబరయుగళహస్తయయి సారసిక ప్రవేశించుచున్నది]

సార—భగవతి! యిది చపలకుండు తెచ్చినవస్త్రయుగ్మము.

మందా—వత్స! కలకంఠ! నీ వీకాషాయయుగ్మముచే శోచనీయమయినను నావేషము ధరించుకొమ్ము. ఇది విపరీతోపభోగవిరుద్ధమే యయినను దీనిచేతనీవు రమయంతికను బొందం గలవు. [అందఱు నవ్వుచున్నారు]

మారు—ఇదియు మనకు మంగళమే యనుకోవచ్చును.

కల—[చిఱునవ్వుతో వస్త్రయుగ్మము తీసికొని నిష్క్రమించి మందాకినీవేషముతోఁ బ్రవేశించి] ఇదిగో! భగవతి నయితిని.

మారు—శంబరకుఁడు నీపాదములమీఁదఁ బడుఁగాక.

మందా—[కాళిందీనవమాలికలఁ జూచి] బిడ్డలారా! మీరిద్దఱుఁ గలకంఠునితోఁ గూడ నీమహాపురుషుననుసరింపుఁడు.

ఇద్దఱు—చిత్తము భగవతి!

మాకం—[చిఱునవ్వుతో] భగవతి! శంబరకునిఁ బెండ్లియాడఁ బోవుచున్నాను.

మందా—వత్సా! ముందు నీకుఁ జెప్పినమార్గమున మాయభిలషితము నెఱవేర్పుము.

మాకం—మిత్రుఁడా! రమ్ము కలకంఠ! మాధవునకు నేను నీవంటివాఁడనే సుమీ.

కల—మహాపురుష! మా కందఱకు నీవు పూజ్యతముఁడవు. పోదము రమ్ము. [కాళిందీనవమాలికలతో నిష్క్రమించుచున్నారు]

మల్లి—సఖులారా! నా కిక్కడ సాయ మెవరు?

నవ—[చిఱునవ్వుతో నించుక మరలి] ఇదిగో నీమహాభాగుఁడే.

మందా—భ్రమరక! నీవుకూడ గూఢముగా విష్ణురాతునింటికిఁ బోయి మధుకరిక చెప్పినట్లు కావింపుము.

భ్రమ—చిత్తము భగవతి! [నిష్క్రమించుచున్నాఁడు]

మందా—మారుత! యిదిగో నిరుగడ వృక్షముగా వెలుఁగువేసి కాషాయంబడెడు నీయఘ్నానవీథి నాయాశ్రమము నంటి యున్నది. ఇక్కడ నంబికాపర్ణశాల మునకు మల్లికాలకుఁ బుష్పోడియునుకతోఁ జక్కనిదారి యొకటి యేర్పఱుపఁబడియున్నది. కావున మనము పోవుదము. అస్మదాశ్రమోపశల్యభూములు రమణీయములు సుమీ అక్కడ—

మ. స్వైరపులీలలం దొసంగు సౌఖ్యము మీకు నవాభ్రశంకమా
యూరకుమారనృత్య సమయోచితనిస్వనశబ్దవత్తమా
శ్రోనుతమోనిగూఢములు సుచ్ఛమరీచకిసాలఖాపక్వ
స్వాదుచకోరికానయన శారము లౌపికభుక్తచూతముల్.

నాం—

చ. అలసినఁ గిన్నెరలన్ వనలతాంతవితానలతాగృహంబులం
నొలయుచు మెల్లమెల్లమిము నోపికతో భజియించు నూత్నని
ష్ఠితబహుప్రసూనమకరంద నిమగ్నసముత్థితంబు లౌ
కిలకిలహంసర్కాన సుముఖంబులు సోమసరస్సమీరముల్.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్య.

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వద్దాదిసాధువంశ... కాసుభాకరాచ్ఛనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్రగుణకదంబ... శోత్తముక్తాఫల సూపరాజప్రధాన తనూభవ విబుధవిధేయ సుబ్బరాయ... నాంధ్రీకృతే మల్లికామారుతప్రకరణమునందు షష్ఠాంకము.

సమాప్తము.

For REFERENCE ONLY

... లయము
సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.



ఉ. స్వైరపులీలలం దొసఁగు సౌఖ్యము మీకు నవాభ్రశంకమా
యూరకుమారనృత్య సమయోచితనిస్వనశబ్దనత్తమా
యూకుతమోనిగూఢములు సుచ్ఛమరీచకిసాలఖాపక్వ
న్యాయచకోరికానయన శారము తాపికభుక్త చూతముల్.

నాందీ—

సీ. అలసినఁ గ్రీడలన్ వనలతాంతవితానలతాగృహంబులం
గొలయును మెల్లమెల్లమియు నోపికతో భజియించు నూత్న రీ
ప్రీతిబహుప్రసూనమకరంద నిమగ్నసముత్థితంబు లౌ
కలకలహంపఙ్క్తాన సుముఖంబులు స్సోమపరస్సమీరముల్.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

—✻ గద్య. ✻—

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వద్దాదిసాధువంశ...
కాసుభాకారాచ్ఛనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్రగుణకదంబాలఙ్కారం
...సుక్తాఫల సూరపరాజప్రధాన తనూభవ విబుధవిధేయ సుబ్బారాయణ
ప్రణీతమైన మల్లికామారుతప్రకరణమునందు షష్ఠాంకము.

సమాప్తము.

For REFERENCE ONLY

కృ... వరదరాం... గ్రంథాలయము
సుల్తాన్‌బజార్, హైదరాబాద్: 1.

